*(కాపీరైటు ప్రకటన :- ఈ శ్లోకాలకు అర్థము బ్రహ్మశ్రీ మండా కృష్ణశ్రీకాంత్ శర్మగారు "స్తోత్రనిధి" కోసము మాత్రమే వ్రాసి తయారుచేశారు. వారు వ్రాసిన అర్థము కూడా కాపీ చేయాలనుకునేవారు, ఆయన పేరును కూడా ప్రస్తావించగలరు.)*

**హే స్వామినాథ కరుణాకర దీనబంధో**
**శ్రీపార్వతీశముఖపంకజపద్మబంధో |**
**శ్రీశాదిదేవగణపూజితపాదపద్మ**
**వల్లీశనాథ మమ దేహి కరావలంబమ్ || ౧ ||**

అర్థం – హే స్వామినాథా, కరుణాకరా, దీనబాంధవా, శ్రీ పార్వతీశ (శివ) ముఖ కమలమునకు బంధుడా (పుత్రుడా), శ్రీశ (ధనపతి) మొదలగు దేవగణములచే పూజింపబడు పాదపద్మములు కలిగిన ఓ వల్లీశనాథా, నాకు చేయూతనివ్వుము.

**దేవాదిదేవసుత దేవగణాధినాథ [నుత]**

**దేవేంద్రవంద్య మృదుపంకజమంజుపాద |**

**దేవర్షినారదమునీంద్రసుగీతకీర్తే**

**వల్లీశనాథ మమ దేహి కరావలంబమ్ || ౨ ||**

అర్థం – దేవాదిదేవుని (శివుడి) సుతుడా, దేవగణములకు అధిపతీ, దేవేంద్రునిచే వందనము చేయబడు మృదువైన పద్మములవంటి పాదములు కలవాడా, దేవ ఋషి అయిన నారద మునీంద్రునిచే సంకీర్తనము చేయబడు ఓ వల్లీశనాథా, నాకు చేయూతనివ్వుము.

**నిత్యాన్నదాననిరతాఖిలరోగహారిన్**
**తస్మాత్ప్రదానపరిపూరితభక్తకామ | [భాగ్య]**
**శ్రుత్యాగమప్రణవవాచ్యనిజస్వరూప**
**వల్లీశనాథ మమ దేహి కరావలంబమ్ || 3 ||**

అర్థం – నిత్యము అన్నదానము చేయువాడా, అఖిల రోగములను హరించుటలో నిమగ్నుడవైనవాడా, తద్వారా భక్తులకోరికలను తీర్చువాడా, శ్రుతులు (వేదములు), ఆగమములయందు చెప్పబడిన ప్రణవానికి నిజమైన స్వరూపము కలిగిన ఓ వల్లీశనాథా, నాకు చేయూతనివ్వుము.

**క్రౌంచాసురేంద్రపరిఖండనశక్తిశూల-**

**-పాశాదిశస్త్రపరిమండితదివ్యపాణే | [చాపాది]**

**శ్రీకుండలీశధరతుండశిఖీంద్రవాహ**

**వల్లీశనాథ మమ దేహి కరావలంబమ్ || ౪ ||**

అర్థం – అసురుల రాజును ఖండించిన శక్తిశూలం, పాశము మొదలయిన శస్త్రములతో అలంకరింపబడిన చేతులుకలిగి, శ్రీకుండలములు ధరించిన నాయకుడా, శిఖీంద్ర (నెమలి) చే మోయబడు ఓ వల్లీశనాథా, నాకు చేయూతనివ్వుము.

**దేవాదిదేవ రథమండలమధ్యవేద్య**
**దేవేంద్రపీఠనగరం దృఢచాపహస్తమ్ |**
**శూరం నిహత్య సురకోటిభిరీడ్యమాన**
**వల్లీశనాథ మమ దేహి కరావలంబమ్ || ౫ ||**

అర్థం – దేవాదిదేవా, రథముల సమూహములో మధ్యలో పరివేష్టితుడవై ఉండువాడా, దేవేంద్రపీఠము ఉన్న నగరములో దృఢంగా విల్లును చేతిలో పట్టుకుని, శూరత్వము కలిగి, సురకోటిచే ప్రశంసింపబడిన ఓ వల్లీశనాథా, నాకు చేయూతనివ్వుము.

**హీరాదిరత్నమణియుక్తకిరీటహార [హారాది]**
**కేయూరకుండలలసత్కవచాభిరామమ్ |**
**హే వీర తారక జయాఽమరబృందవంద్య**
**వల్లీశనాథ మమ దేహి కరావలంబమ్ || ౬ ||**

అర్థం – వజ్రము మొదలగు రత్నములతో, మాణిక్యములతో చేయబడిన కిరీటము, హారములు, కేయూరములు, కుండలములు మరియు కవచముతో అందముగా అలంకరింపబడి, వీర తారకుడిని జయించి, దేవతా బృందముచే వందనము చేయబడిన ఓ వల్లీశనాథా, నాకు చేయూతనివ్వుము.

**పంచాక్షరాదిమనుమంత్రితగాంగతోయైః**
**పంచామృతైః ప్రముదితేంద్రముఖైర్మునీంద్రైః |**
**పట్టాభిషిక్త హరియుక్త పరాసనాథ**
**వల్లీశనాథ మమ దేహి కరావలంబమ్ || ౭ ||**

అర్థం – పంచాక్షరాది మంత్రములతో అభిమంత్రించిన గంగాజలములతో, పంచామృతములతో, ఆనందముఖముతో ఉన్న ఇంద్రునిచే మునీంద్రులు పట్టాభిషేకము చేసిన ఓ వల్లీశనాథా, నాకు చేయూతనివ్వుము.

శ్రీకార్త్తికేయ కరుణామృతపూర్ణదృష్ట్యా
కామాదిరోగకలుషీకృతదుష్టచిత్తమ్ ।
సిక్త్వా తు మామవకళాధర కాంతికాంత్యా
వల్లీశనాథ మమ దేహి కరావలంబమ్ ॥ ౮ ॥

అర్థం – శ్రీకార్త్తికేయా, కరుణామృతము పూర్తిగా కలిగిన దృష్టితో, కామాది రోగములతో కలుషితమైన నా దుష్ట చిత్తమును, నా కళావిహీనమైన కాంతిని నీ కాంతితో చల్లి, ఓ వల్లీశనాథా, నాకు చేయూతనివ్వుము.

**సుబ్రహ్మణ్యాష్టకం పుణ్యం యే పఠంతి ద్విజోత్తమాః |**
**తే సర్వే ముక్తిమాయాంతి సుబ్రహ్మణ్య ప్రసాదతః ||**
**౯ ||**

అర్థం – సుబ్రహ్మణ్యాష్టకం పుణ్యవంతమైనది. దీనిని యే ద్విజులు పఠించెదరో వారు ముక్తిని సుబ్రహ్మణ్య ప్రసాదము వలన పొందగలరు.

**సుబ్రహ్మణ్యాష్టకమిదం ప్రాతరుత్థాయ యః పఠేత్ |**
**కోటిజన్మకృతం పాపం తత్క్షణాదేవ నశ్యతి || ౧౦ ||**

అర్థం – ఈ సుబ్రహ్మణ్యాష్టకమును ఎవరైతే ప్రొద్దున్నే లేవగానే పఠించెదరో, వారి కోటిజన్మలలో చేసిన పాపము తక్షణం నశించును.

**ఇతి శ్రీ సుబ్రహ్మణ్యాష్టకమ్ |**